# రాజయోగ రాగమాలిక

మరియు

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి
దివ్యచరితము

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి
శతజయంత్యోత్సవ సంచిక

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి ప్రియశిష్యుడు

**రాపెల్లి శ్రీధర్**

# రాజయోగ రాగమాలిక

మరియు

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి
దివ్యచరితము

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి
శతజయంత్యోత్సవ సంచిక

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి ప్రియశిష్యుడు

**రాపెల్లి శ్రీధర్**

*At the lotus feet of*

## SWAMI DAYANANDA RAJAYOGI

*A euphony from the heart-symphony*

Birth, life and death are the lila of thy game;
Boundless universe without thee is lame;
Embodied thyself on this immense earth;
To abate her sorrow and sustain her worth!

Thy teachings are hidden in my heart;
Thou hast removed me from thy art;
Genuflections unto thee, O Rajayogi's disciple;
Salutations unto thee; O Sivarama's principle!

Let me now perceive thee, O Permit of sight;
Let me take ablution in thee, O Wisdom light;
Let me serve thee, O Divine delight;
Let me take refuge in thee, O Hermit of bright!

**Rapelli Sridhar**






## ఆశీస్సులు

శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమ సాంప్రదాయకులకు గురు పదములు సదా స్మరణ చేయుటకుపయుక్తములగునటుల అ॥ ప॥ చి॥ రాపెల్లి శ్రీధర్ రచించి ప్రకటించిన ఈ రాజయోగ రాగమాలిక భక్త జనుల ఆదరణ పొంది, ఆదర్శనీయమౌ గాక. శుభాశీస్సులు.

ఇట్లు
పీఠాధిపతి
**శ్రీదయానంద పొన్నాల సాందీపిని రాజయోగి.**

శ్రీ శివరామ దీక్షిత అచల గురు పీఠ రాజయోగాశ్రమం,
సికింద్రాబాద్.
**13-04-1998**

# అభినందన

అచల పరిపూర్ణ చిరంజీవి రాపెల్లి శ్రీధర్‌ను గత ఇరువది సంవత్సరముల నుండి నేనెరుగుదును. ఇతని తల్లిదండ్రులు శకుంతల, రామచంద్రం. పూవు పుట్టగనే తన పరిమళమును తనయందు సంతరించుకొని కాలానుగుణ్యముగ నది వికసించగనే గుభాళింప జేసికొనునటుల చిరంజీవి రాపెల్లి శ్రీధర్ తన తల్లి దండ్రుల సహచర్యమున శ్రీమదచలర్షి దయానంద పాన్నాల రాజయోగీశ్వరుల వారి ప్రియశిష్యులు శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి వలన చిరుత ప్రాయముననే పరిపూర్ణ ప్రబోధ వినుచు, తనయందు జీర్ణింప జేసికొని, మననము చేసికొనుచు సాంప్రదాయక సభలలో ఉపన్యాసము లిచ్చుచు వివేకానందుల వారికి అంతేవాసియై తమ దేశికేంద్రుల వారికి వినమ్రతతో భక్తి పురస్సరముగా 'రాజయోగ రాగమాలిక' యనుపేర మృదు మధురముగ పంచవింశతి గీతములను రచించి తన గురుదేవుల గళసీమయందు వానిని నలరింప జేయదలంచి నాకడకు తేగా వానినన్నింటిని పరిశీలించి అటనట అవసరమైన సవరణలు గావించు భాగ్యము నాకు లభించినది. చిరంజీవికి నాపై గల యభిమానమునకు నాకెంతో ఆనందము కలిగించినది. ఈ రాజయోగ రాగమాలికను రచించి గ్రంథరూపముగా విడుదల కావించుచున్నందులకు చిరంజీవి రాపెల్లి శ్రీధర్‌ను హృదయ పూర్వకముగ అభినందించుచున్నాను.

12/5/98

(శ్రీ అమరానంద పాటలు పంఢరినాథ్)

# పీఠిక

"తల్లి ఏడ్చే పసిబిడ్డను నిద్రపుచ్చుటకు పాటలు పాడుతుంది.
ఆ పాటల అర్థము పసిబిడ్డకు తెలియునా? తెలియదు."

అయిననూ తల్లి కంఠ మాధుర్యమును గ్రోలి, శోకమును మాని పసిబిడ్డడు హాయిగా నిద్రించును. ఆ పసిబిడ్డడే పెద్దవాడయిన తర్వాత విషయవాంఛా వలయంలో దుఃఖించుచున్నప్పుడు, తల్లి వచ్చి పాటలు పాడి దుఃఖాన్ని తొలగించలేదు. సుఖాన్ని కలిగించలేదు. కనుక దుఃఖసాగరంలో ఉన్న మానవుడు పరిపూర్ణ గురువును చేరి త్రికరణ శుద్ధిగా నడుచుకొనుచూ సాధనా చతుష్టయం, శుశ్రూషా చతుష్టయాలను సాధించవలెను. ప్రాథమిక దశలో ఉన్న శిష్యుడు ప్రపంచ సంబంధమైన దుఃఖముల నుండి ఉపశమనము కొరకు ఈ రాజయోగ రాగమాలికలోని పాటలను గానము చేస్తూ; వాటిలోని మాధుర్యమును గ్రోలుతూ గురుదేవుని ప్రసన్నం చేసికొని మృతత్వము నుండి అమృతత్వము వైపు పయనించవలెను. గానానికి రాగాలెన్నో కలవు. కాని పాడే గొంతు ఒక్కటే. ఎన్నియో రాగాలలో మరెన్నియో గానాలు చేసిననూ; వాటన్నింటికి మూలం ఒక్కటే. అదే నాదము. ఓంకారనాదము. కనుక ఎన్ని గీతాలు గానం చేసిననూ; మరెన్నో సంకీర్తనలు పాడిననూ; ఇంకా ఎన్నెన్నో తత్వములు ఆలాపన చేసిననూ వారి ప్రయాణం ఓంకారముగు బ్రహ్మము (ఎరుక) వరకే అని తెలియవలెను. పాటల చేత ఓంకారమగు బ్రహ్మమునకు అతీతంగా ఉన్న పరిపూర్ణబ్రహ్మము తెలియబడదు. 'నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే'. ఆ పరిపూర్ణ బ్రహ్మమును గురుముఖాన ఎరిగిన వానికి పాటలతో పనిలేదు. అందుకే 'తత్వమెరుగు వెనుక తత్వంబులేటికో?' అని అచలర్షి వేమన యోగి చెప్పియున్నాడు.

కనుక పాటలు ప్రాథమిక దశలో ఉన్న శిష్యునికి తాత్కాలిక విషయానందమునే కలుగచేయగలవు; కాని శాశ్వత జనన మరణ భ్రాంతి రహితమును చేయలేవు. కావున శిష్యుడు ఈ భక్తిరస గేయములను గానము చేస్తూ, మొదట తన హృదయమును పవిత్రమొనర్చుకొని; తర్వాత సద్గురుని ద్వారా అచలపరిపూర్ణబోధను క్రమ క్రమముగా వినుచూ; విన్న దానిని ఆచరణలో పెట్టవలెను. ఇదియే జనన మరణ భ్రాంతి రహితమునకు ఏకైక మార్గము.

సద్గురువర్యులు పూజ్య శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి గారి కరుణా కటాక్షముచే విని కని కలసిన విషయాలను నా హృదయాంతరముల నుండి గేయములుగా వెలువరించితిని. జిజ్ఞాసులు ఈ గేయములను భక్తితో గానం చేసి హృదయాలను పునీతము చేసుకొందురని ఆశిస్తున్నాను.

రాగాల మాలిక ఈ రాజయోగ రాగ మాలికయందున్న 25 తత్వములనే 25 పుష్పములుగా చేసి ఓంకారమను దారానికి గుచ్చి మద్గురుదేవుని కంఠమునకు గురుదక్షిణగా అలరునటుల వారి దివ్యచరణకమలములకు సాష్టాంగ ప్రణామములు చేస్తూ భక్తిపూర్వకముగా అర్పించుచున్నాను.

ఈ మాలిక పుష్పాలను సరిచేసి సుగంధముతో వికసింప చేసిన మధురకవి శ్రీ అవులానంద పాటల పంఢరీనాథ్ రాజయోగి గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుచున్నాను.

ఈ రాజయోగ రాగమాలికకు ఆశించగానే ఆశీస్సులను అందజేసిన పరమపూజ్యులు శ్రీ దయానంద డా॥ పొన్నాల సాందీపిని రాజయోగీశ్వరుల దివ్యపదకమలములకు భయభక్తి పూర్వకముగా నమస్కృతులు ఒనర్చుచున్నాను.

శ్రీ శివరామ దీక్షిత అచల గురూప పీఠ
రాజయోగాశ్రమం,
బచ్చన్నపేట, జిల్లా: వరంగల్,
ఆంధ్ర ప్రదేశ్, ఇండియా.

ఇట్లు
సద్గురుని పాదసేవలో
రాపెల్లి శ్రీధర్



# సూచిక

## శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి దివ్యచరితము

అచల పరిపూర్ణ రాజయోగము అతి పూరాతనమైన యోగము. ఈ యోగము అతి ప్రాచీనకాలము నుండి గురుశిష్య సాంప్రదాయకముగా ఒకరి చేత మరొకరికి బోధించబడుతూ నేటికినీ భారతదేశములో సుప్రతిష్ఠితమై అలరారుచున్నది. భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు అజగరుడు అను గురువునుండి, మౌన సాంజ్ఞామూర్తి దక్షిణామూర్తి ( శంకరుడు) తన గురుదేవుడైన సదాశివుని నుండి, భగవద్గీతను గానంచేసిన శ్రీకృష్ణుడు సాందీపిని స్వామి నుండి ఈ ప్రబోధను గ్రహించినారని చారిత్రకమైన ఆధారాలను బట్టి తెలుస్తుంది. ఇది పరమ రహస్యమైన యోగమని శ్రీకృష్ణుడు అర్జునునికి తెలియజేశాడు. ఇట్టి యోగమును ఈ కలియుగములో శ్రీవేమనయోగి, శ్రీశివరామ దీక్షితులు, శ్రీ భాగవతకృష్ణ దేశికులు ఉద్ధరించారు. వీరిలో శ్రీవేమనయోగి క్రీ.శ 15వ శతాబ్దికి చెందినవారు. ఆయన తన గళమునుండి వేలకొలది ఆటవెలది పద్యాలను అజ్ఞానాంధకారంలో వున్న అభాగ్యుల గూర్చి పలికించాడు. ఆనాటి ప్రజలు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత మతముల పరస్పర విరుద్ధ భావములకు గురియై దిక్కుతోచని స్థితిలో నుండిరి. ఆ సమయములో కాలగర్భములో కలిసిపోయిన ఈ యోగమును వేమన యోగి ఉద్ధరించి ప్రచారానికి తీసుకవచ్చి దురాచారాలను, దుష్టసంస్కృతులను, దుష్ట మతాలను తన పద్య ఫణితిచే విమర్శనాత్మకముగ ఖండించెను. వేమనను ఆ శతాబ్దానికి యుగకర్తగ చెప్పవచ్చును. వేమన తర్వాత కాలంలో ఈ యోగము యొక్క ప్రచారము తగ్గిపోయినది. మళ్ళీ క్రీ.శ **1740 -1800** కాలములో ఈ యోగము శ్రీశివరామదీక్షితుల ద్వారా ప్రచారములోకి వచ్చినది. శివరామదీక్షితులు వేమనలా రహస్య పద్యరీతిచే గాక నిర్దుష్టమైన 'బృహద్వాసిష్ఠము' అనే గ్రంథరాజముచే అచల సిద్ధాంతమును వినూత్న పద్ధతిలో ఆంధ్రదేశమున ఉద్ధరించెను. ఆ తర్వాత క్రీ.శ **1850-1900** కాలములో శ్రీ భాగవత కృష్ణ దేశికులు తమ కందార్థ కంద పద్యములచే ఈ సిద్ధాంతమును ఒక క్రమ విధానములో ప్రచారములోకి తీసుక వచ్చిరి. తదుపరి శ్రీ లక్ష్మణ దేశికులు, వీరి తమ్ముడు శ్రీ శంకర్ రావు గారు ఈ బోధను ప్రచారము గావించిరి. వీరి తర్వాత లక్ష్మణదేశికుల శిష్యుడైన శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర అవధూత స్వాముల వారు ఆజన్మాంతము బ్రహ్మచారిగా యుండి వారి శక్తియుక్తులన్నింటిని ఈ యోగము యొక్క ప్రచారము కొరకు ధారపోసిరి. వీరి తర్వాత



వీరి శిష్యుడైన శ్రీ భూమానంద హనుమంత రాజయోగి ఈ యోగమును ప్రచారమొనర్చుటకొరకై ఒక మహాత్ముని తయారు చేసి ఆంధ్రలోకముకు ఇచ్చిరి. ఆ మహాత్ముడే శ్రీదయానంద పొన్నాల రాజయోగి వీరు తమ గురుదేవుడొసగిన మేధా సంపత్తి, శక్తి, యుక్తులచే సర్వజనులకు అర్థమయ్యే రీతిలో ఈ అచల సిద్ధాంతమును 'రాజయోగీయము' లను గ్రంథములచే విపుల పరచిరి. వీరిని ఈ 20వ శతాబ్దమునకు యుగపురుషునిగ చెప్పవచ్చును. వీరు అచల పరిపూర్ణ రాజయోగమును నిర్దుష్టమైన క్రమ విధానములో బోధించుటకు అవసరమైన గ్రంథములను అచ్చు తెలుగులో రచించి ప్రచారమునకు తెచ్చిరి. వీరి వేదవేదాంత సిద్ధాంత పాండిత్య ప్రకాశమునందు ఆంధ్రదేశమునందలి అనేక పండిత ప్రకాండులు తలలు వంచిరి. వీరి క్రమశిక్షణ, సమయస్ఫూర్తి, సమయపాలన, పట్టుదల, గురుభక్తి, గురు సేవ, గురు నిష్ఠ, బోధనా విధానము, మేధా సంపత్తి ఎంతటి వారినైన ఇట్టే ఆకట్టుకోగలవు.

శ్రీ దయానంద రాజయోగి మహాయోగి. వీరు తరించి ఇతరులు తరించుటకొరకై వీరు ప్రజ్ఞావంతులైన శిష్యులకొందరిని ఎన్నుకొని వారిని శిష్యరత్నములుగ తీర్చి దిద్దిరి. ఆ శిష్య రత్నములలో ఒకరైన శ్రీవివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి జీవిత చరిత్రను తెలియజేయుటే ఈ వ్యాసము యొక్క ప్రధానాంశము.

శ్రీ శివరామదీక్షితులు జన్మించిన పవిత్రమైన జిల్లా నల్లగొండ. ఆ జిల్లాలోనే సూర్యాపేట తాలుకాలో శిరిగొండ అను ఒక గ్రామము కలదు. ఆ గ్రామములో ధర్మాచరణ పరాయణులగు శ్రీమతి లచ్చమాంబ మరియు శ్రీ ఆగోలు లక్ష్మీనర్సయ్య అను దంపతులు కలరు. వీరు సంతాన ప్రాప్తికై దేవతారాధనలు చేసిరి. వీరికి ప్రథమమున ఒక అమ్మాయి కలిగెను. ఆమెకు వెంకట నర్సమ్మ అని పేరిడిరి. ఆ తర్వాత మగ సంతానమునకై ఆ దంపతులు ఆ గ్రామమునకు దగ్గర యున్న సంగమేశ్వర గుడిలో పూజలు సల్పిరి. ఆ తర్వాత కొంత కాలమునకు శ్రీమతి లచ్చమాంబ గర్భమున (క్రీ.శ **1900**వ సం॥ములో) శార్వరి నామ సంవత్సరము, చైత్రశుద్ధ దశిమి ఉదయకాలమున ఒక తేజోవంతుడైన అబ్బాయి పుట్టెను. ఆతనికి 'సంగయ్య' అని పేరిడిరి. ఆ తర్వాత కొంత కాలమునకు వారికి మరొక అబ్బాయి కలిగెను. ఆతనికి 'నర్సయ్య' అని పేరిడిరి. శ్రీలక్ష్మీనర్సయ్య గారి వృత్తి వ్యవసాయము. వ్యవసాయముతో వచ్చు ఆదాయముతో వారి కుటుంబము ఏ చింతలు లేకుండా

సంతృప్తిగా పిల్లా పాపలతో చక్కగా సాగిపోసాగెను. వీరి ప్రథమ పుత్రుడు సంగయ్య అల్లారు ముద్దుగా పెరుగుచుండెను. వీరు చిన్నగా వున్ననాడు ఒకనాడు ఇంట్లో సామానుల గదిలో ఒక కుండలోనున్న జీడిగింజలను నమిలి పూర్తిగా మ్రింగిరి. అందువల్ల వీరికి ఏమీ కాలేదు. వీరు పిన్న నాటినుండి తండ్రిగారితో పచ్చని పొలాలలో తిరుగుతూ చల్లనిగాలికి ఆనందించుతూ ఉండెడివారు. ఆ తర్వాత ఆ గ్రామమున కల పాఠశాలకు వెళ్లి 3వ వాచకము వరకు విద్యాభ్యాసము గావించిరి. ఒక ప్రక్క తీరిక వేళల్లో తల్లి దండ్రులకు పొలం పనులలో తోటబావి దగ్గర సహాయపడుతూ, మిగతా సమయాలలో విద్యాభ్యాసము చేస్తూయుండిరి. వీరు చిన్నప్పటి నుండే వేదాంత గ్రంథములను, భారత భాగవతాది గ్రంథములను ప్రోగు చేసి చదువుతూ వుండెడివారు. వీరికి **14** సంవత్సరములు నిండు వరకు ఇలానే వీరి జీవితము శిరికొండలో గడిచెను. ఇలా వీరి జీవితములో ఆధ్యాత్మిక బీజములు చిన్న నాటనే చిగురించెను. పువ్వు పుట్టుటతోడనే పరిమళము వెదజల్లును గదా! ఆ తర్వాత సంవత్సరములోనే వీరి అక్కయ్య వెంకటనర్సమ్మ గారి వివాహము జరిగెను. నూతన దంపతులు ఖమ్మంలో కాపురము పెట్టిరి. అక్కయ్యకు సహాయముగా శ్రీ సంగయ్య కూడా ఖమ్మం వెళ్ళి అచటనే వుండిరి. ఖమ్మంలో వీరు **4**వ వాచకము పూర్తి చేసిరి. ఆ తర్వాత వీరు ఖమ్మంలోనే వున్న ఒక కిరాణ వర్తక దుఖాణములో పనిచేస్తూ నెలకు పదిరూపాయలు సంపాదిస్తూ, అక్కయ్య బావలకు చేదోడువాదోడు వుంటూ వుండిరి. ఆ దుకాణములో పనిచేస్తున్న సమయంలోనే శ్రీవారు ఆధ్యాత్మిక చింతన చేస్తూ భజనల ద్వారా ప్రజల్ని ఆకర్షించుచుండిరి. భక్తులైన వారు తమ తమ గ్రామాలకు శ్రీవారిని రప్పించుకొని, భజనలు చెప్పించుకొనెడివారు. ఇలా శ్రీవారు దుకాణం పని వదులుకొని గ్రామాంతరాలకు వెళ్ళి భజనలుచెప్పుట యందే ఎక్కువ కాలము గడిచినది. శ్రీవారి సుమధురమైన కంఠము, సంగీత స్వర విజ్ఞానము, ఆధ్యాత్మిక వచనములు వేలకొలది మందిని ఆకర్షించుచూ వుండెను. శ్రీవారి జీవితము ఇలా **22** సంవత్సరములు గడచినవి. ఆ కాలములోనే ఒక ఇంటిని ఖమ్మంలోనే నిర్మించిరి. **23**వ సంవత్సరములో శ్రీవారి వివాహము 'రామమ్మ' అను కన్యారత్నముతో జరిగెను. నూతన వధూవరుల కాపురము చక్కగా సాగుచుండెను. **3** సంవత్సరముల తర్వాత అకస్మాత్తుగా శ్రీవారి పత్నికి తెలియని రోగమొకటి వచ్చినది. అందుచే ఆమె చనిపోవుట జరిగెను. పత్నీ వియోగముచే చలించని శ్రీవారిలో ఆధ్యాత్మిక చింతన పెరగసాగెను. శ్రీవారి పర్యటనలు అధికమయ్యెను. భగవంతుని కీర్తనలు ఆలాపిస్తూ



భగవద్భక్తులను రంజింప జేయుచుండెను. పల్లెల్లో, గ్రామాల్లో, పంటతోటల్లో, చెట్టు కొమ్మల్లో ఇలా వీరి భజన వేదికలు అనేకములు. ఈ సమయంలోనే వీరు అద్వైత మత గ్రంథాలను క్షుణ్ణంగా చదివారు. ఇలా **3** సంవత్సరాలు గడిచాయి. శ్రీవారికి **25** సంవత్సరాలు నిండాయి. నవ యవ్వనంలో వున్న శ్రీవారు ఒంటరిగా వుండటం వీరి అక్కయ్య వెంకటనర్సమ్మకు చాలా బాధకలిగించినది. శ్రీవారిని మళ్ళీ పెళ్లి చేసుకోమని బలవంతము చేసి ఎటులనో ఒప్పించి తన బిడ్డయగు 'నర్సమాంబ' యను కన్యారత్నముతో వివాహము జరిపించెను. పెళ్లి అయిన తర్వాత కూడా ఒకవైపు సంసారబాధ్యతలు వహిస్తూ, మరొకవైపు ఆధ్యాత్మిక భజనలు, గోష్ఠులు నిర్వహించుచుండెను. ఇలా వీరి జీవితము **15** సం॥లకు పైగా గడిచెను. ఆ కాలములోనే శ్రీమతి నర్సమాంబ ఒక కుమారున్ని ప్రసవించి చనిపోవుట జరిగెను. ఆ కుమారునికి 'పాండురంగారావు' అని పేరిడిరి. తల్లి లేని పిల్లవాడగుటచే, ఆ అబ్బాయిని శ్రీవారు వారి అక్కగారగు వెంకట నర్సమ్మకు అప్పగించిరి. పత్ని వియోగముచే కలత చెందక, శ్రీవారు యథావిధిగా అద్వైత ఆధ్యాత్మిక బోధనలు చేయుచు ఉరూరా తిరుగుచూ వుండిరి. ఆ సమయంలోనే కడపలో శ్రీనారాయణదాసు అనే కవి మరియు వేదాంత పండితుడు ఒకరి వుండిరి. వీరు పంఢరి భజనలు చెప్పెడివారు. వీరిని గూర్చి తెలుసుకొని శ్రీవారు కడపకు వెళ్ళి వారి వద్ద ' ఓం నారాయణాయ' అను మంత్రోపదేశము తీసుకొనిరి. వారి వద్ద కొన్ని ముఖ్యసూత్రములను గ్రహించిరి. యథా పూర్వముగా భజనలు ఉపదేశాలు చెపుతూ వేలకొలది మంది శిష్యులకు దీక్షనిచ్చుచూ వుండిరి.

శ్రీవారు ఈ సమయంలోనే వరంగల్ జిల్లాను పర్యటించిరి. వరంగల్ జిల్లాలో నున్న స్టేషన్ ఘనపురం, ఇప్పగూడెం, ముత్తారం, మొదలగు గ్రామాలలో శ్రీవారు వేదాంత సభలను ఏర్పాటు చేసిరి. అంతలోనే పద్దూరులో యున్న దొర శ్రీవారిని గూర్చి ఎవరి ద్వారానో విని శ్రీవారిని తన కడకు ఆహ్వానించుకొనెను. ఆ దొర యొక్క ఆరోగ్యము బాగా లేకుండెను. కాలుచేయిలు కదపలేని స్థితిలో వుండెను. శ్రీవారు వారికి **40** రోజులు తీర్థ ప్రసాదములు ఇస్తూ వారి గృహముననే యుండిరి. కొలది రోజులలోనే ఆ దొర పూర్తిగ కోలుకొనెను. శ్రీవారి యొక్క మహత్తు యందు వారికి పూర్తి విశ్వాసమేర్పడి, శ్రీవారి యొక్క మొత్తము కుటుంబమును పద్దూరుకు రప్పించుకొనిరి.

వారందరకు సకల సౌకర్యములను ఏర్పాటు చేశారు. అంతియేగాక శ్రీవారికి 30 ఎకరాల భూమి దానముగా ఇచ్చి సత్కరించిరి. శ్రీవారి వారి కుటుంబము తల్లిదండ్రులు మరియు తమ్ముడును కూడ ఆ గ్రామమున యుండునట్లు వారు వేడుకొనిరి. అందుచే శ్రీవారు వారి కోరికను మన్నించి సుమారు పది సంవత్సరాలు పద్దూరులో యుండి వారి కుటుంబమునంతటికి అద్వైత ప్రబోధ గావించుచుండిరి. పద్దూరులో యున్నప్పుడే శ్రీవారు వరంగల్‌కు చెందిన ఒక కవీశ్వరుని ద్వారా శ్రీదయానంద పొన్నాల రాజయోగి గూర్చి వినడం జరిగెను. అంతలోనే ఆ దొర యొక్క ఆరోగ్యము పూర్తిగా క్షీణించెను. వారు శ్రీవారి యొక్క క్షేమము గోరుచూ, తన మరణము తర్వాత తన కొడుకులు శ్రీవారికి ఇచ్చిన భూమిపై ఏమైనా తగాదా పెట్టుదురని ఆలోచించి పూర్తి భూమిని అమ్మి వచ్చిన డబ్బును శ్రీవారికి ఇచ్చి, మీ ఇష్టమైన వేరే ప్రాంతమునకు వెళ్లవలసినదని శ్రీవారిని కోరిరి. శ్రీవారు అచట నుండి ఖమ్మం వచ్చిరి. తమ్ముడు శ్రీనర్సయ్యగారు మణుగూరులో భూములు కొనుక్కొని అటనే కుటుంబముతో స్థిరపడిరి. అందుకు కావలసిన డబ్బులు శ్రీవారే ఇచ్చిరి. మిగతా డబ్బుతో శ్రీవారు ఖమ్మం దగ్గరలో యున్న కొండెగూడెంలో $3^3/_4$ ఎకరాల వరిపొలము కొని వ్యవసాయం చేపిస్తూ, తానుమాత్రము ఖమ్మంలో యున్న స్వంత ఇంటిలో వుంటూ వుండిరి. అది వరకే పొన్నాల రాజయోగి గూర్చి విని యుండుటచేత శ్రీవారు వారిని కలియుటకు సమాయత్తమవుచుండిరి. శ్రీవారి ఇంటి వెనుకనే శ్రీమందిప్పల హనుమంత రాజయోగి శిష్యుడొకరు 'శ్రీవెంకటరామయ్య' అనునతడు యుండిరి. అతనిని వెంటతోలుకొని, సికింద్రాబాద్ వెళ్లి శ్రీదయానంద పొన్నాల రాజయోగితో శ్రీవారు పరిచయము చేసుకొని వేదాంత చర్చలు జరిపిరి. అద్వైతమున కన్న ఈ అచల సిద్ధాంతము ఉన్నతమైనదని శ్రీవారు అతితొందరలో గ్రహించి శ్రీదయానంద పొన్నాల రాజయోగి వద్ద ధర్మోపదేశమును గైకొనిరి. ఈ శుభ సంఘటన క్రీ.శ **1950**వ సం॥న జరిగినది.

శ్రీవారు ఉపదేశము పొందినది మొదలు ఒక సంవత్సరము కఠిన పరిశ్రమ చేసి బోధను ఆమూలాగ్రముగ నిర్దుష్టమైన సాంప్రదాయక విధానమున శ్రీరాజయోగీశ్వరుల కరుణాకటాక్షముచే గ్రహించిరి. ఆ సంవత్సర కాలమున సికింద్రాబాద్ మందిరమున యుండి గురుసేవా పరాయణుడై ఏకాగ్రతతో తారక, సాంఖ్య, అమనస్క, మహావాక్యనిర్ణయ పద్ధతులను, మత విధానాలను, అచల



పరిపూర్ణ రాజయోగ విధానమును పూర్ణముగా గ్రహించిరి. శ్రీవారు ఒక నెల సికింద్రాబాద్‌లో యుండి పాఠములను వ్రాసుకొని, మరుసటి నెల ఖమ్మంలో యుండి వాటిని పూర్తిగ కంఠస్థము చేసి, ఆ తర్వాత సికింద్రాబాద్‌లో తమ గురుదేవులకు వినిపించి, ఆ తర్వాత పాఠములను ఒక నెల అచటనే యుండి వ్రాసుకొనెడివారు. సికింద్రాబాద్‌లో యున్నప్పుడు శ్రీవారి నిత్య చర్యలు ఈ విధంగా యుండెను. సాగర్‌మే నహానా, గురుదేవ్‌కే సామ్నె పఢ్‌నా, హోటల్‌మే ఖానా, మందిర్‌మే సోనా. వ్యర్థ సంభాషణలకు, కాలహరణ ప్రసంగాలకు శ్రీవారు ఆమెడ దూరం. పూర్తి సమయాన్ని ప్రబోధను నేర్చుకోవడానికి వినియోగించేవారు. ఇలా ఒక సంవత్సర కాలం పాటు శ్రీవారు ఒక నెల ఖమ్మం, ఒక నెల సికింద్రాబాద్ లో యుండి తమ గురుదేవుల ద్వారా వేదవేదాంత సిద్ధాంత రహస్యములను అతి తక్కువ కాలములోనే, అత్యధిక శ్రమపడి గ్రహించిరి.

అలా శ్రీవారు పరిపూర్ణ ప్రబోధను గ్రహించి, బోధాధికారమును కూడా క్రీ.శ. **1950** లోనే పొందిరి. శ్రీవారి యొక్క వివేక జ్ఞానమును, దక్షతను గ్రహించి శ్రీదయానందుల వారు శ్రీవారికి 'వివేకానంద' యను దీక్షిత నామమిడిరి.

ఇక శ్రీవారు సిద్ధాంతమును ప్రచారము చేయుటయే జీవిత లక్ష్యముగా శ్రీ దయానందుల ఎదుట ప్రతిజ్ఞ చేసి దేశ పర్యటనకు బయలుదేరిరి. శ్రీవారికి అదివరకే అనేక వేలమంది శిష్యులు వుండిరి. వారు శ్రీవారిని చేరి ఇదివరకు చెప్పిన భజనలు, సభలు జరుపవలసినదిగా కోరుచుండిరి. కాని శ్రీవారి యొక్క గమనము మారినది. ఈ అచల పరిపూర్ణరాజయోగము వారికి క్రొత్త. శ్రీవారు వారందరకు ఈ నూతన విధానము యొక్క విశిష్ఠతను తెలుపుచుండిరి. వారిలో కొందరికి మాత్రమే ఈ సిద్ధాంతము యొక్క విశిష్ఠత అవగాహన అయ్యెను. మిగతావారు పాతదారులను వెదకుచు వెళ్లిపోయిరి.

శ్రీవారిని వీడిపోకుండా కొందరు పాత శిష్యులు వెన్నంటి యుండిరి. వీరిలో కొందరు అన్నారు గూడెం ఖమ్మం జిల్లాకు చెందినవారు. వీరు అద్వైత సిద్ధాంతమును వదలివేసి ఈ అచల సిద్ధాంతమును ఆమూలాగ్రముగ శ్రీవారినుండి గ్రహించిరి. క్రీ.శ. **1953** న అన్నారు గూడెం గ్రామమున

రెండు రోజుల మహాసభలు శ్రీదయానందుల వారి అధ్యక్షతన, శ్రీవారి కార్యదర్శిత్వమున మహావైభవోపేతముగ జరిగినవి. ఈ సభలకు సాంప్రదాయక బోధాధికారులందరు విచ్చేసి దిగ్విజయముగ వారి దివ్య సందేశములను భక్తజనుల కంద జేసిరి.

ఇలా శ్రీవారు క్రీ.శ. **1954-1964** మధ్య కాలములో అన్నారు గూడెం, మధిర, కొత్త గూడెం, ఖమ్మం మొదలగు గ్రామాలలో యున్న శిష్యజనులకు ప్రబోధను బోధించి యుండిరి.

శ్రీ వారు క్రీ.శ. **1964**లో కొత్తగూడెంలో ప్రబోధించుచుండెను. ఆ సమయంలో శ్రీసత్యనారాయణ గారు (రాగి రామబ్రహ్మం గారి బావగారు) శ్రీవారిని కలుసుకొని సంభాషించుట జరిగెను. తొలి పరిచయంలోనే శ్రీవారి బోధనా చాతుర్యమునకు ముగ్ధుడై ఉపదేశము గైకొనెను. ఆ తర్వాత అదే సంవత్సరములో శ్రీవారిని వారి బావమరిది వూరగు ముస్త్యాల, జిల్లా వరంగల్‌కు ఆహ్వానించిరి. శ్రీవారు **1964**లో ముస్త్యాలకు రావడం జరిగెను. అచ్చట రాగి రామబ్రహ్మంగారి అన్నదమ్ములు ధర్మోపదేశము గైకొనిరి. ఆ తర్వాత **2** నెలలకు శ్రీ బొడ్డు శేఖరయ్య (డాక్టర్) శ్రీవారి వద్ద ధర్మోపదేశము గైకొనిరి. కొన్ని నెలలు ప్రబోధ ముస్త్యాల యందు శ్రీవారిచే చెప్పబడినది. చుట్టుప్రక్కల గ్రామాల వారు కూడా రావడం వినడం జరిగినది. అలా శిష్యుల సంఖ్య పెరగసాగెను. అందువల్ల శ్రీవారు ముస్త్యాలలోనే బొడ్డుశేఖరయ్య గారింట్లో వుండడం జరిగింది. శ్రీ వారు **1964-1974** వరకు దాదాపు ఇరువది సంవత్సరాలు ముస్త్యాలలో ప్రబోధ గావించుచు, ఆధ్యాత్మిక సభలు ప్రతి సంవత్సరము ఏర్పరచుచు యుండిరి. రాగి రామబ్రహ్మం గారి బంధువులగు శ్రీ తంగెళ్ళపల్లి బ్రహ్మయ్య, రామస్వామి, లక్ష్మయ్య మొదలగు వారు (బచ్చన్న పేట వాస్తవ్యులు) ధర్మోపదేశము పొందిరి. శ్రీ పొట్లబత్తిని మార్కండేయులు (టీచర్) గారు కూడా ముస్త్యాలలో శ్రీవారి వద్ద ధర్మోపదేశము పొందిరి. వీరి కోరికపై శ్రీవారు బచ్చన్న పేట గ్రామమునకు వచ్చిరి.

శ్రీవారు బచ్చన్నపేటలో భగవద్గీత గూర్చి **40** రోజులు ప్రసంగించిరి. శ్రీవారి యొక్క



ప్రబోధలకు ప్రభావితులైన బచ్చన్నపేట వాస్తవ్యులగు శ్రీ తంగెళ్ళపల్లి శ్రీహరి (టీచర్), శ్రీ రాపెల్లి రామచంద్రం (టీచర్) ధర్మోపదేశము గైకొనిరి

శ్రీ ఎద్దు నర్సయ్యగారు (శ్రీవారు ముస్త్యాలలో యున్న కాలములోనే) ఒక సారి శ్రీవారు ఖమ్మంలో యున్నపుడు అక్కడికి వెళ్ళి ధర్మోపదేశము గైకొనిరి.

బచ్చన్నపేట వాస్తవ్యులు మరియు చుట్టుప్రక్కల గ్రామాల వారుకూడా శ్రీవారికి వందల సంఖ్యలో శిష్యులుగా ఏర్పడిరి. శిష్యుల కోరిక మేరకు శ్రీవారు అచటనే వుండి ప్రబోధ గావించుటకొరకు ఒక ఆశ్రమమును నిర్మించదలచిరి. అందు కొరకై ముఖ్యంగా శ్రీ ఎద్దు నర్సయ్యగారు, శ్రీ తంగెళ్ళపల్లి శ్రీ హరి గారు, శ్రీ పి. మార్కండేయులు గారు, శ్రీ రాపెల్లి రామచంద్రం గారు, శ్రీ వేముల సిద్దయ్యగారు, శ్రీ పి. బ్రహ్మానందము గారు, శ్రీ ఆకుల సిద్దిలింగముగారు మొదలగు ప్రముఖులు వీరి మిత్రబృందముతో విరాళములు సేకరించి బచ్చన్నపేటలో **1000** చదరపు గజముల విస్తీర్ణముగల స్థలమును కొనిరి. ఆ స్థలంలో పాత గృహము ఒకటి యుండెను. శ్రీవారు బచ్చన్నపేటలో **1976** నుండి ఆ ఆశ్రమములో ఉంటూ వుండిరి. కాలక్రమములో చిన్నగా వున్న ఆశ్రమము అన్ని విధాలుగా అభివృద్ధి చెంది శ్రీవారి కృపచే నేటి దశకు చేరుకున్నది. భవిష్యత్తులో కూడ ఈ ఆశ్రమము యొక్క ఉన్నతి ఎంతో పెరగగలదు.

ఈ బచ్చన్నపేట ఆశ్రమాన్ని స్థానంగా ఏర్పరచుకొని శ్రీవారు క్రీ.శ **1976 - 1999** వరకు అనేక ప్రాంతాలను సందర్శించుచు అచటి భక్తజనులకు ప్రబోధ గావించుచు యున్నారు.

శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్రం గారు శ్రీవారికి కుడి భుజముగా వుంటూ బచ్చన్నపేట ఆశ్రమ నిర్వహణలో పాలుపంచుకుంటూ, శ్రీవారికి అంతేవాసియై కలకాలం సపర్యలు వీరి కుటుంబ సమేతముగా నిర్వహించుచున్నారు.

శ్రీవారి జీవితంలో అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత ఆచరణ విధానం పరిపూర్ణముగా

యున్నది. వీరి జీవిత విధానములో తెలుసుకోవలసిన విషయాలు. సమయపాలన, వాక్పాలన, పరిశుభ్రత, నియమిత ఆహార విధానం, దేహ పరిశ్రమ, మృదు మధుర సంభాషణ విధానం, సమయస్ఫూర్తి, జితేంద్రియత్వం, మౌనము, మేధాసంపత్తి మొదలగు సద్గుణాలు వీరి ఆచరణల వల్ల తెలియబడినాయి.

గురుగీతలో శంకరుడు పార్వతీ దేవికి చెప్పిన విధంగా

శ్లో॥ గూఢోదృఢశ్చ ప్రీతశ్చ। మౌనేన సుసమాహితః
సకృత్కామ గతోవా2పి। పంచధా గురురీరితః॥

తా॥ రహస్యవృత్తి గలవాడును, ధైర్యము గలవాడును, సంతోష చిత్తుడును, మౌనముతో నుండువాడును, లోకోద్ధరణయే యేకైక కోరికగా గలవాడును అగు జనుడు ఈ అయిదు విధములచేతను గురువని చెప్పబడుచున్నాడు.

పైన చెప్పబడిన ఈ అయిదు విధములు శ్రీవారి జీవితమందు అక్షరాల నిజము.

1. రహస్యవృత్తి కలవాడుః శ్రీవారు తమ జీవితంలోను, బోధవిషయంలోను, ప్రపంచ ప్రవర్తన విధానంలోను రహస్యవృత్తి కలిగియుండిరి.

2. ధైర్యము కలవాడుః శ్రీవారు ఒంటరిగా పోరాడిన సందర్భాలు ఎన్నో వున్నాయి. ఉదాహరణకు శ్రీవారు కొత్తగూడెంలో యున్నప్పుడు శ్రీ వేముల రామయ్య (అవధూత వేంకటేశ్వర రావు గారి శిష్యుని శిష్యుడు) మరియు వారి మిత్రబృందము శ్రీవారిని వారితో మాట్లాడుటకు ఆహ్వానించిరి. వారి స్థావరంలోకి శ్రీవారు రాగానే వారిని నిర్బంధించి కొట్టుటకు కుట్ర పన్నిరి. ఈ విషయం వారిని కలియుటకు బయలు దేరు సమయమున ఎవరి ద్వారానో శ్రీవారికి తెలిసెను. అయినను శ్రీవారు ధైర్యముగా అచటి వెళ్లిరి. శ్రీ వేముల రామయ్యగారు శ్రీవారి గురువగు శ్రీ దయానందుల వారిని నిందించుచుండిరి. ప్రమాణ పత్రములను శ్రీ పొన్నాల రాజయోగి కల్పించారని వాదించ సాగిరి. వారి ప్రశ్నలకు జవాబు ఇస్తూ వారితో వేదాంత విషయములను, సాంప్రదాయక రహస్యములను చర్చించిరి. దానికి ముగ్ధులై వారు శ్రీవారి పాదములపై మోకరిల్లిరి.



3. సంతోష చిత్తుడుః శ్రీవారు నిరంతరము సంతోషచిత్తులై యుండిరి. ఈ సద్గుణము శ్రీ వారి జీవితంలో ఎన్నో సార్లు ఋజువయ్యెను. శ్రీవారి కుమారుడు శ్రీ ఆగోలు పాండురంగారావు రైలు ప్రమాదములో మరణించినప్పుడును మరియు శ్రీవారి మనువరాలి వివాహ సమయమందుకూడ శ్రీవారు ఆయా కార్యస్థానములను సందర్శించక ఎటువంటి చిత్తవికారమునకు లోనుకాక సంతోష చిత్తుడై వుండెను.

4. మౌనముతో నుండువాడుః శ్రీవారు తమ జీవితంలో శిష్యులు ప్రశ్నలు అడిగే వరకు మౌనము వహించుచుండిరి. ఏమి అడగనిచో నెలలు అయినను ఏమి ప్రబోధించెడివారు కాదు.

5. లోకోద్ధరణయే యేకైక కోరిక కలవాడుః శ్రీవారు భక్త జనుల ఉద్ధరణయే జీవిత లక్ష్యముగానెంచుకొని వివిధ గ్రామాలు తిరుగుచు ప్రబోధించుచుండిరి.

శ్రీవారు విస్తృతముగా పర్యటించిన ప్రాంతాలుః అన్నారుగూడెం, డోర్నకల్, మధిర, కొత్తగూడెం, కాచారం, చేర్యాల, కట్కూర్, రేబర్తి, వల్లంపట్ల, నాగపూరి, మన్‌సాన్ పల్లి, అయినాపూర్, జూలపల్లి, గోదావరిఖని, మంచిర్యాల, సోమగూడెం, సోలాపూర్, పూనె, బొంబాయి, హైద్రాబాద్, శనిగరం, సిద్దిపేట, సిరిసిల్ల, చిట్యాల, ముస్త్యాల, ఖమ్మం మొదలగునవి.

ఇలా శ్రీవారు కలకాలం లోకోద్ధరణకై ప్రబోధలు చేయాలని ఆ గురుపరమాత్మను వేడుకొనుచున్నాము.



# 1. రాజయోగీ వందనం

పల్లవి : శ్రీ వివేకానంద రాజయోగీ వందనం
దయానంద ప్రియ శిష్యా
వందనం అభివందనం ॥శ్రీ॥

చరణాలు :

1. సకల దేవతా సమూహ
వందితా అభివందనం;
నిఖిల లోక రక్షణీయ
సురవరా సుమార్చితం ॥శ్రీ॥

2. అచలపూర్ణ యోగభావ
శోభితా అభివందనం;
సచల కామ మోహదహన
నిర్గుణా నిరంజనం ॥శ్రీ॥

3. సతత స్మితా శ్రీధరేనా
సేవితా అభివందనం;
జగతి రహిత సంగమేశ
సద్గురూ సమదర్శనం ॥శ్రీ॥





# 2. శ్రీ గురుమూర్తినీ

పల్లవి : శ్రీ గురుమూర్తినీ మదిలో తలచుకో
శ్రీ గురుచరణము హృదిలో నిలుపుకో ॥శ్రీ॥

చరణాలు :

1. ఏ జపమెందుకూ... ఏ తపమెందుకూ...
ఏ వ్రతములు యెందుకూ ఆత్మ తత్వమెరుగకా
ఎరుకలోన మరుపులోన రాజయోగిని తలచుకో ॥శ్రీ॥

2. తీర్థములెందుకూ... యాగములెందుకూ...
దానాదులు యెందుకూ గురుతత్వము గాంచకా
సంగయాఖ్య సన్నిధిలో స్వస్వరూపమెరుగుమూ ॥శ్రీ॥

3. దేహమువీడినా... జన్మము తప్పునా...
ఏ జన్మమెత్తిననూ దుఃఖము విడిపోవునా
రామచంద్ర తనయునితో రాగమేల కలుపవూ ॥శ్రీ॥



## 3. విశ్వవీధి చూడరా

పల్లవి : విశ్వవీధి చూడరా... అచలమార్గమెరుగరా...
సత్యాన్వేషణ యేదో ఈ మార్గపు ఊపిరిరా ॥వి॥

చరణాలు :

1. జీవులలో కెల్ల ఉత్కృష్టమైన మానవుడా
విశిష్ఠ మానవా! విశిష్ఠ మానవా!! విశిష్ఠ మానవా!!! ॥వి॥

2. ఆశామోహాదులతో బంధమైన జీవుడా
వినలేదా? ఎవరికి వారెమునా తీరనుమాటా ॥వి ॥

3. శబ్ద స్పర్శాదులతో వాంఛా విషవలయంలో
స్థిర మేమిటో తెలియకా సతమతమయ్యేవా? ॥వి॥

4. ముక్తి పథము జూపును అచల ప్రబోధము
సంగయాఖ్య జేరీ శంక వదలరా
వందే గురుదేవయని వందనంబు సేయరా
శ్రీధర్ యెడదను యేలే సద్గురువుకు మ్రొక్కరా! ॥వి॥





## 4. జయ గురుదేవా

పల్లవి : దేవా.. గురుదేవా... జయ గురుదేవా....దయజూపవా!
నీ చరణంబులికవీడ దరిజేర్చవా!! ॥దేవా॥

చరణాలు :

1. ప్రతి నిత్యము పూజింతు నీ రూపము
నిరతము ధ్యానింతు నీ నామము
నన్ను కరుణించవా, నా వ్యధ దీర్చవా ॥దేవా॥

2. బహు జన్మముల బాధ నే బొందితీ
ఈ ఒన్మమున నీదు దరిగాంచితి
నన్ను చేకొనవా, నా హృది గాంచవా ॥దేవా॥

3. పునరపి మరణం పునరపి జననం
పునరపి జననీ జఠరే శయనం
మునుపిది బాపుమా, భవ భయరహితమూ ॥దేవా॥

4. జయ స్వప్రకాశా జయ సంగయాఖ్యా
జయ గురునాథా అభయ ప్రదాతా
మమ్ము పాలించుమా , నీ దాసులమూ ॥దేవా॥

5. శ్రీమించ శ్రీధరుడు విరచించెను
ఈ జనన మరణాలు యిక లేవులే
ఈ తెర వెరిగినా, అహమే లేదులే ॥దేవా॥



## 5. నిత్య సత్యాయ

పల్లవి : గురువరా.. ప్రభువరా... దేవా
గహనాతీత నిత్య సత్యాయ ॥గురు॥

చరణాలు :

1. సనకాది ముని వందితవర్యా
నిగమార్థ ప్రతిపాదకార్యా
బ్రహ్మ విష్ణు పరమేశ్వర రూపా...
సగుణ నిర్గుణ సాక్ష్యాతీత
శుద్ధాయ శుభకరా ॥గురు॥

2. దయానంద మునిమౌని ప్రియా
ఆత్మానాత్మ రహిత నిష్క్రియా
బంధమోక్ష ద్వయా విహీనా ...
శ్రీధర సన్నుత సనాతనా
సద్గురు సంగయార్య ॥గురు॥





## 6. గురుని జేరి నీవు

పల్లవి : గురుని జేరి నీవు, పరము నెరుగుమన్నా
నీవు యన్న దేదో, తరచి చూడుమన్నా ॥గురు॥

చరణాలు :

1. జన్మజన్మల దుఃఖములోనా
దినము దినము తెలియక గడిచే;
క్షణ కాలము సఫలము జేయగ
సద్గురుని జేరలేవా? ॥గురు॥

2. యుగ యుగముల చరిత్రలోనా
కోట్ల కొలది జన్మలు యెత్తి;
బహుబాధలు పొందిన నీవు
భవ బాధను బాపుటకై ! ॥గురు॥

3. అష్టైశ్వర్యంబులు యున్ననూ
ఆశ వీడదు మానవుడా;
తృప్తి కలగని మనజునికీ
నరకమే గతి యౌనురా! ॥గురు॥

4. అష్టకష్ట పరంపరలోనా
విసిగియున్నజీవుడా;
ఆత్మ స్వరూపము గానలేక
వగచుచుందువేలరా? ॥గురు॥

5. నిన్ను నీవు మొదట గాంచకా
దేవుడెవరని అడిగెదవేలా?
పూర్ణబోధ గురునిచె వింటే
దేవుడే గురుదేవుడూ! ॥గురు॥

6. ఎరుక మరుపుల లేమిని తెలిపి
పరిపూర్ణ పరమును జూపీ;
బ్రోచునట్టి కరుణామయుని
చరణాల వేగబడరా ॥గురు॥

7. సంగమేశ్వర ప్రభువును చేరీ
పరము నెరిగెను శ్రీధరుడు;
ఆ తెరగున భవ బాధల్లెల్లను
కల కల్లగ యౌనులేరా! ॥గురు॥





## 7. నమో సుప్రకాశ

హే! వివేకానంద అజ్ఞాన మూలహరణా!
బ్రహ్మ విష్ణు మహేశ్వర స్తుతా సద్గురోత్తమా!
హే! నరసమాంబ హృదయవల్లభా పూర్ణభావా!
సకల భక్త జన సేవితా పాదపద్మా!

పల్లవి : నమో సంగయాఖ్య..నమో సద్గురేశా...
నమో సుప్రకాశ..నమో సత్యశీలా... ॥నమో॥

చరణాలు :

1. సకల శాస్త్రసార, అచలపూర్ణభావ
సంశయ విచ్ఛేద స్వామి నీవే బ్రోవ
నమో రాజయోగి వర్యా నమో నమామి! ॥నమో॥

2. భవరోగ నాశ, సదా గాత్రశూన్య
సంసారాబ్ధిదాట ప్రభూ కరుణ జూపయ
నమో రాజయోగి వర్యా నమో నమామి! ॥నమో॥

3. సకల ద్వంద్వనాశ, మహాదేవదేవ
శ్రీధర సంసేవితా మమ్మేలు కోవా?
నమో రాజయోగి వర్యా నమో నమామి! ॥నమో॥



## 8. ఎరుకే బ్రహ్మము

పల్లవి : ఎరుకే బ్రహ్మమూ ఎరుకే కర్మమూ
ఎరుకే జ్ఞానమూ యెంచి చూడుమా....... ఆ..ఆ..ఆ... ॥ఎ॥

చరణాలు :

1. సకల లోకమ్ములకూ మూలస్తంభమూ
వివిధ కార్య రచన జేసె తెలివిరూపమూ;
అచలము తెలియక వుండిన వారినీ
వదలక త్రిప్పు నట్టి ఎరుక చక్రమూ ॥ఎ॥

2. వింత వింత భ్రాంతులకూ పుట్టినిల్లదీ
చిత్ర చిత్ర చింతలకూ మెట్టినిల్లదీ;
అన్నియు తానెయ్యై తనకవి వేరనీ
వున్నది లేనిదనీ లేనిదీ కలదనూ ॥ఎ॥

3. ధరణిలోన పొన్నాల దయానందునీ
శరణుజేరి ధీరుడైన సంగమేశునీ
కృపచే శ్రీధరుడు యెరుకను విడిచెనూ
చేరీ మ్రొక్కవేల భ్రాంతి బాపునూ ॥ఎ॥





## 9. కృపాసాగరా రావా

జయ జయ గురుదేవా నమో మహాదేవా
దయానంద ప్రియా వివేకానంద జీ

పల్లవి : సంగయాఖ్య ఓ దేవా! కృపాసాగరా రావా ననుగావరా!!
కురిపించుమా కరుణా బోధించుమా బోధా ॥సం॥

చరణాలు :

1. అన్య సాధన యెరుగ, నీదు బోధను విడువా
బాస జేసితినో పూర్ణ పురుషా! సంపూజితా గురు ॥సం॥

2. పరిపూర్ణ మననేమి? పాపసంహరణా
ఎరుక యన్నను నేమి? భవతాపహరణా
క్రమముగా నెరిగించు నీ దివ్య చరణా
ధూళిలో శిరముంతు చూపించు కరుణా ॥సం॥

3. నీ కరుణామృత దృష్టి కష్టములు తొలగూ
సృష్టిలోన శంక యిక నెందు రాదూ ॥సం॥

4. కనుకరింపుము దేవ కరుణాంతరంగా
వరరాజయోగి గురు హృదయాంతరంగా ॥సం॥

5. రాజ ఋషివర రాకపోకలు బాపవేలనయా
ఎరుక పుట్టుట గిట్టుట తెలిపియు తీసివేయుమయా
శ్రీధర సన్నుత సత్యశీలా బ్రోవగ రావయ్యా
నాదు మొర విని నన్ను కావగ జాగును చేయకయా
దేవరా గురుదేవరా మహదేవరా భజదేవరా ॥సం॥



## 10. ఆడేవు నీకిది లీలకై

పల్లవి : ఎరుకయె నీవు మరుపును చేసి ఆడేవు నీకిది లీలకై
దేహివి నీవే దేహము దాల్చి వగచేవు యీవింత గాంచక ॥ఎ॥

చరణాలు :

1. లోకాలు సృష్టించినావూ, కేళికి నీవూ
మరలా నీ లోపలికి నీవు గొనిపోదువూ
భూతాలు నీవే కలిగించినావే
సకల లోకాలలో త్రిప్పేవులే
ఎన్నెన్నొ సాధనలు సున్నజేసి
మర్త్యలోకాన నీవే త్రోసేవులే ॥ఎ॥

2. గురుజేరి ఎరుకేదో ఎరిగి కనుము బయలూ
యెరుకే యెరుక యెరిగిపోతే, అదియే లేదూ
దయానంద బోధ దయచే నీవూ
భక్త జనకోటికి బోధించేవులే
సంగయాఖ్య దీక్ష కరుణించు వేళ
శ్రీధరునిలో శ్రీని ముంచేవులే ॥ఎ॥





## 11. ఏలనయ గురురాయ

పల్లవి : ఏలనయ గురురాయ నన్ను యేలుకోరాదా?
నీ పద దాసుడనూ అంతియె వాసుడనూ ॥ఏ॥

చరణాలు :

1. అష్టాంగయోగాలు నిష్ఠతో జేస్తినయా
అసలు మూలమెరుగలేక అడవిలోన బడితినయా ॥ఏ॥

2. మఠములో జేరితయా హఠముతో నుంటినయా
జఠరము నే విడువలేక జగతిలోన బడితినయా ॥ఏ॥

3. ముద్రలు జేస్తినయా చక్రలు గంటినయా
ఆత్మను నే గాంచలేక ఆదిలోనె చెడితినయా ॥ఏ॥

4. మంత్రాలు చదివితయా ఉపాసన జేసితయా
భక్తిమార్గ మెరుగలేక భంగపడి పోతినయా ॥ఏ॥

5. మతములో చేరితయా బుద్ధిని నిలిపితయా
హితమేదో గాంచలేక వెర్రిలోన బడితినయా ॥ఏ॥

6. యోగములు చేస్తినయా మనసును నిలిపితయా
కోరికలు నే విడలేక కోరి నిన్ను చేరితయా ॥ఏ॥

7. జననమరణ బాధలు ఓర్వలేక నేనయా
చేస్తినెన్నో సాధనలు తెరువులేక పోయెనయా ॥ఏ॥

8. శరణని యంటినయా కరుణించ వింటినయా
ఆత్మయె ఈ జగమునకూ ఆధారమంటిరయా ॥ఏ॥

9. ఆత్మమూలమేమన స్వయంభూ అంటిరయా
పుట్టున దెప్పుడైననూ గిట్టూనని వింటినయా ॥ఏ॥

10. ఆత్మయే బీజమనీ జగత్తే వృక్షమనీ
కారణము లేకపోతే కార్యము లేదంటిరయా ॥ఏ॥

11. వృక్షము కూకటివేరు త్రవ్వగ జూస్తినయా
పూర్ణబోధాగ్నిచేత కాల్చగ బాధేదయా ॥ఏ॥

12. దయానంద దయచే పూర్ణము గంటిరయా
వివేక దీక్షను వేగమె చేకొంటిరయా ॥ఏ॥

13. శ్రీధరుని పాటనయా శ్రమించు బాటనయా
శీఘ్రమె బ్రోవుమయా జాలివేగ జూపుమయా ॥ఏ॥





## 12. శ్రీ గురువరతే నమోనమో

పల్లవి : శ్రీగురువరతే నమోనమో!
శ్రీధర సన్నుత నమోనమో!! ॥శ్రీ॥

చరణాలు :

1. శుభకర భవహర విశుద్ధ మాధవ
సుజన సుసేవిత చరణయుగ
పరమ పురుష భవబంధ విమోచక
రాజయోగి తే నమోనమో! ॥శ్రీ॥

2. క్షరాక్షర పురుష ద్వయదోషరహిత
దీక్షా! దక్ష రక్షణీయ
సంశయ వినాశ సద్గురురాయా
సంగయార్య తే నమోనమో! ॥శ్రీ॥

3. ఆది దేవ సకలాగమ పూజిత
వివేకానంద విమల గుణ
ఆగోలు వంశ క్షీరాబ్ధి చంద్ర
రామచంద్ర ప్రియ నమోనమో! ॥శ్రీ॥



## 13. ఇంటిదైవము

పల్లవి : సుఖమైన దుఃఖమైన యేది యేమైనను
గురుదేవుడే! మా యింటి దైవము ॥సు॥

చరణాలు :

1. గాలియైన వానయైన పిడుగుపాటు యేమైనను
పగలు గాని రేయిగాని కానీ యేమైనను
కాలత్రయములలోన క్రమము తప్పక నడచు
రాజయోగి యే మా నిజదైవమూ! ॥సు॥

2. చిన్నయైనను పెద్దయైనను చెలగీయేమైనను
భోగిగాని రోగిగాని కానీ యేమైనను
పాపరహితున్ని జేసి పూర్ణమును జూపించు
సంగయాఖ్యుడే మా పరమ దైవము! ॥సు॥

3. దొంగయైనను దొరయైనను జేరీయేమైనను
పాపిగాని దోషిగాని కానీ యేమైనను
దాసులై సేవ జేయ కరుణించి శరణిచ్చు
శ్రీధరున్నేలె ఎదదైవమూ! ॥సు॥





## 14. మనసా

పల్లవి : ఎరుకయందునా మరుపుయందునా
గురుదేవ గురుదేవయని కొలువవో మనసా! ॥ఎ॥

చరణాలు :

1. గురువవతారములే అఖిలదేవతలు
గురువులోనివే బ్రహ్మాండంబులు
గురునామములే అన్ని మంత్రములు
గురు గురు సద్గురుయనవో మనసా! ॥ఎ॥

2. గురుని మహిమలే ఎరుక జగంబులు
గురుని గాత్రమే వట వృక్షంబు
గురుడొక్కడే సదా గహనాతీతుడు
గురు గురు వనుచును వెదుకవో మనసా ! ॥ఎ॥

3. గురుడితడే సురస్వప్నస్వరూపుడు
పూర్ణగురుండే అశరీరుండు
శ్రీధరు వలెనే శ్రీ సంగయాఖ్యు జేరి
జయ గురు జయ గురు శరణనవో మనసా! ॥ఎ॥



## 15. ప్రభూ మా జనన మరణములు

పల్లవి : ప్రభూ! మా జనన మరణములూ
బిరానా మాన్పుమో దేవా !! ॥ప్ర॥

చరణాలు :

1. స్వచ్ఛంబౌ బోధనెగజల్లీ, స్వరూపము తెలియనెరిగించూ;
స్వామి మీ దివ్య నామమునూ, సతతము హృదిలోనుంచుదుమూ ॥ప్ర॥

2. నీ యొక్క సృష్టి జాలములో, స్థిరంబును ఎరుగి లేమయ్యా;
సంసార లోలురము మేమూ, సంశయ రహితుడవు నీవూ ॥ప్ర॥

3. అంతటానున్నదీ జూపీ, చింతలు ఎరుగనిది దెలిపీ;
ప్రవిమల చిత్తునిగ చేసే, వివేకానందుడవు గావే ? ॥ప్ర॥

4. నిత్యము పూజ జేతుమయా, నిరతము నిన్నెతలతుమయా ;
రాజయోగి శిష్యునివి గాదా?, శ్రీధరుని బ్రోచినావు గదా! ॥ప్ర॥





## 16. సంగమేశాయ నమోనమో!

పల్లవి : సంగమేశాయ నమోనమో!
స్వప్రకాశాయ నమోనమో! ॥సం॥

చరణాలు :

1. ఈ గురువర్యుని యెవ్వరు జేరిన భవభయరహితములందరికి
అనంతాయ నమోనమో అఖిలాండాయ నమోనమో
జగద్గురవే నమోనమో జగన్నాథాయ నమోనమో
దేవేశాయ నమోనమో దివ్యగుణాయ నమోనమో
ఈ గురురాయుని యెవ్వరు జేరిన భవభయరహితములందరికి ॥సం॥

2. ఈ గురుదేవుని యెవ్వరు జేరిన భవభయరహితములందరికి
పరిపూర్ణాయ నమోనమో ప్రణవాతీత నమోనమో
సంశయ రహితాయ నమోనమో సాధురక్షాయ నమోనమో
శ్రీధర ప్రియతే నమోనమో శ్రీగురుశేఖర నమోనమో
ఇరవుగ నీగతి నెవ్వరు జేరిన భవభయరహితములందరికి ॥సం॥



## 17. కనుమా! దయజూపుమా!!

పల్లవి : కనుమా! దయజూపుమా!!
నిరతము బ్రోచియు భ్రాంతిబాపుమా!!! ॥కను॥

చరణాలు :

1. గురుశేఖర నినుచేరితినయ్యా
నా ప్రభువనుచును వేడితినయ్యా
నాయెద నీకై యుంచితినయ్యా
చేయుము దీనికి జనన రహితమూ ॥కను॥

2. నీ చరణములే కొలచితినయ్యా
నీ రూపమునే తలచితినయ్యా
నీ వాక్యములే మంత్రములయ్యా
నీ కృపయే మా ముక్తికి నావా ॥కను॥

3. ఉన్నది బయలని చూపితిరయ్యా
ఎరుకే లేదని తెలిపితిరయ్యా
సంగమేశ్వరా అలుకేలయ్యా?
శ్రీధర మొర విన జాగేలయ్యా ॥కను॥





## 18. ఓ కరుణామయా

పల్లవి : ఓ కరుణామయా... ప్రవిమల హృదయా.....
శ్రీ వివేకానంద హే సంగమేశా... ॥ఓ॥

చరణాలు :

1. దీనుల పాలిటి నిజబంధువీవే
భక్తులనేలే భగవానుడీవే
విషయవలయములో చిక్కుకొన్నానూ
దయజూపరాదా? దారిజూపవేల? ॥ఓ॥

2. నీ సేవకై నే వీక్షించినాను
ఎందునున్నావో నేనెరుగలేను
అల్పుడ నేనేల నెరుగుదు నీ మహిమ
అమరధామమునూ చూపించరాదా? ॥ఓ॥

3 సకల లోకమ్ములకాధారమీవు
సంగయాఖ్యని భువి పేరొందినావు
శ్రీధరుని జన్మ తరియింపగ జేసిన
రాజయోగీ ప్రియా రావాదేవా ? ॥ఓ॥



## 19. శ్రీ సంగయాఖ్య రావయ్యా

పల్లవి : శ్రీ సంగయాఖ్య రావయ్యా
చల్లంగ యేలుకోవయ్యా ॥శ్రీ॥

చరణాలు :

1. సతతంబు పాదపూజా హృదియందు చేతునయ్యా
నిరతంబు నా మనంబూ స్మరియించు నయ్య మిమ్మూ ॥శ్రీ॥
2. మౌనంబు యేలనయ్యా? వచనంబు పలుకుమయ్యా
ప్రకటంబు చేయుమయ్యా పలుకెల్ల విందునయ్యా ॥శ్రీ॥
3. విశ్వంబు యేలవచ్చె ? విశదంబు చేయుమయ్యా
జీవంబు కేలనయ్యా? జన్మంబు లెల్లనయ్యా ॥శ్రీ॥
4. బ్రహ్మంబు యనగనేమో? భ్రాంతెల్ల దీర్చుమయ్యా?
భ్రమణంబులింక యేలా ? భక్తుండనైతినయ్యా ॥శ్రీ॥
5. జన్మంబు యేలవచ్చే? కర్మంబు ఏలనయ్యా?
కర్మంబు వలన జూడా కష్టంబులధికమయ్యే ॥శ్రీ॥
6. జ్ఞానంబు ఎరుక జేసీ చీకాకు మాన్పవయ్యా
జననంబు బాపవేలా? ఋడుపెల్లదీరునయ్యా ॥శ్రీ॥
7. శ్రీ రాజయోగి జేరీ శ్రమించు అచల మెరిగీ
శీఘ్రంబె శ్రీధరున్నీ కరుణించి యుంటిరయ్యా ॥శ్రీ॥





## 20. మెల్లగ రావయ్యా

పల్లవి॥ ఒహో సంగమేశా....
ఆగోలు సంగమేశా
మెల్లగ రావయ్యా స్వామి చల్లగ బ్రోవయ్యా
మాకేలా బంధములు యెల్లా
వివేకానంద దీక్షగొన్న విమల గురుడవు నీవే ॥మెల్లగ॥

1. సృష్టి క్రమమును స్పష్టపరచిన సాంఖ్యయోగివినీవే
జీవులన్నిట ఆత్మనెన్నిన ఆత్మయోగివి నీవే ॥మెల్లగ॥
2. కర్మాకర్మల మర్మమెరిగిన కర్మయోగివి నీవే
జ్ఞానాజ్ఞానుల కతీతమైన జ్ఞానయోగివి నీవే ॥మెల్లగ॥
3. జ్ఞానకర్మల ముడిని వీడని భక్తియోగివి నీవే
గురుని పదములు మరువలేని ధ్యానయోగివి నీవే ॥మెల్లగ॥
4. క్షరాక్షరముల మైల విడిచిన అమలయోగివి నీవే
సత్తుచిత్తు ఆనందము మించిన పూర్ణయోగివి నీవే ॥మెల్లగ॥
5. అమృత మృతములు గాక యున్న విమలయోగివి నీవే
ఆత్మానాత్మల మీరియున్న అచలయోగివి నీవే ॥మెల్లగ॥
6. తానులేని తావునెరిగిన తత్వయోగివి నీవే
రాక పోకలు లేక వెలిగే రాజయోగివి నీవే ॥మెల్లగ॥
7. దయానందుని దయను పొందిన దివ్యయోగిని నీవే
శ్రీధరునుని వేగ బ్రోచిన మహాయోగివి నీవే ॥మెల్లగ॥

## 21. ఓ ప్రభురాయ

పల్లవి : ఓ ప్రభురాయ వేవేగ రావా!
మా భవ బాధ ఇక మాన్పలేవా?
నీ శరణంటిమీ నీ కరుణంటిమీ
నీ పదయుగళమే మాకు శుభమంటిమీ ॥ఓ॥

చరణాలు :

1) ఎన్నెన్నో జన్మముల పుణ్యమో
నీ పదాంబుజ సేవ ప్రాప్తించెనూ
నిను సేవింతుమూ, నిను పూజింతుమూ
నీ పద ధూళినే మా తలదాల్తుమూ ॥ఓ॥

2) నీ పసిడి పలుకుల కోసమై
మా చెవులు వేచి వున్నవి
నిను స్మరియింతుమూ, నిను కీర్తింతుమూ
నీ వచనమ్ములే మా మదిదలతుమూ ॥ఓ॥

3) అందాలు విరజిమ్ము నీ గాత్రమూ
తాపాలు తొలగించు వటవృక్షమూ
నిను దర్శింతుమూ, నిను ధ్యానింతుమూ
నీ రూపంబునే మా హృది కొలుతుమూ ॥ఓ॥



4. శుభాలు చేకూర్చు నీ సన్నిధి
అభయంబు నొనగూర్చు నీ పెన్నిధి
నీ దరిజేరగా, మా వెత దీరగా
ఇక నీవే మాయింటి ఇలవేల్పువూ ॥ఓ॥

5. అనసూయ సాధ్వితో అలరారెనూ
రాజయోగియను పేర రంజిల్లెనూ
ఆ గురువర్యుని అతిప్రియశిష్యుడు
శ్రీ ఆగోలు సంగయాఖ్య ధీమంతుడు ॥ఓ॥

6. శకుంతలాదేవి ప్రియపుత్రుడు
రామచంద్ర స్వామీజి వరపుత్రుడు
నిను మెప్పించగా, నిను ఒప్పించగా
ఈ కవనంబు చేసెను కనుపించుమా ॥ఓ॥



## 22. నీవుండే దా మిన్ను పై

పల్లవి: నీవుండే దా మిన్ను పై గురుదేవా నేనుండే దీ మన్నుపై
నిన్నెట్లు పూజింతునో? నా స్వామి నేనెట్లు తరియింతునో? ॥నీవుండే॥

చరణాలు:

1. నీ పూజకై పూవులెన్నెన్నొ తెచ్చా
నీ సేవకై చెట్లాకులే తెచ్చా
పూవుల్లో నీవే ఆకుల్లో నీవే
నిన్నెట్లు సేవింతునో....? దేవా ॥నీవుండే॥

2. నీ పాదములు కడుగ నీళ్ళే తెచ్చా
నీ నోరు కోరేటి పళ్ళన్నీ తెచ్చా
నీళ్ళల్లో నీవే పళ్ళల్లో నీవే
నిన్నెట్లు సేవింతునో....? దేవా ॥నీవుండే॥

3. నీ మేనునకు బూయ విభూతి తెచ్చా
నీ ముఖానికి అలర గంధంబు తెచ్చా
విభూతి నీవే గంధంబు నీవే
నిన్నెట్లు సేవింతునో....? దేవా ॥నీవుండే॥

4. అన్నియు నీవైన సంగమేశుడ నీవు
రాజయోగి జేరి రాకపోక లేక
శ్రీధరున్ని బ్రోచిన దేవాధిదేవా
నన్నేల కరుణించవో....? దేవా ॥నీవుండే॥





## 23. నమో సంగమేశా

పల్లవి: నమో సంగమేశా! జయ జయ నమో దివ్యతేజా!!
వివేకానంద దీక్షా నామమె సమస్త జీవంబులకు క్షేమము ॥ నమో ॥

చరణాలు:

1. మరుపు రూపుండనూ, వేగ మీ రూపమెరుగలేనూ
పగలు రేయి నా హృదిని వసించియు
చింతదీర్చి మోదంబు గూర్చుము ॥ నమో ॥

2. నరుని రూపమెత్తీ, నా మనసు తీర్చిదిద్దీ
ముగ్గురు మూర్తుల మూలమూర్తియగు
శబ్దబ్రహ్మమును ఎరుక జేసితిరి ॥ నమో ॥

3. బయలు ఎరుకలకునూ, భేదము ఎరుక పరచినాయా
బయలే కలదని ఎరుకే లేదనీ
బోధ జేసి నా బాధ బాపితిరి ॥ నమో ॥

4. రాజయోగి జేరీ, వేగమె ధీరుడైతివీవే
సంతసముగ నా ప్రభువే యనుచును
శ్రీధరుండు ఇల చాట జేసెను ॥ నమో ॥



## 24. సంశయాలన్ని మదివీడరా...

పల్లవి : సంగమేశున్ని దరిజేరరా..
సంశయాలన్ని మదివీడరా .... ఓ.. ఓ... ॥సం॥

చరణాలు :

1. మంత్రమహిమల్లో తగ్గించు రక్తి
షణ్మతముల్లో మరిలేదు ముక్తి
సకల వ్రతముల్లో సరిలేదు భక్తి
వర్ణాదుల్లో గురిలేదు ముక్తి
ముక్తి మూలంబు మదిగాంచరా!
సంశయాలన్ని మదివీడరా.... ఓ... ఓ. ॥సం॥

2. అష్టాంగాల్లో బంధించి మనసూ
కష్టాంగాల్లో కడతేరు మనసూ
సాంఖ్యయోగాన్ని వినలేదు మనసూ
తత్వయోగాన్ని కనలేదు మనసూ
మనసు మూలంబు మదిగాంచరా!
సంశయాలన్ని మదివీడరా .. ఓ... ఓ ॥సం॥

3. చచ్చె చదువుల్లో మరివుంది భుక్తి
చావని చదువులో మరివుంది ముక్తి
చావని చదువేల చదువవే మనసా?
చచ్చి పుట్టేటి తనువేల మనసా?
చావు మూలంబు మదిగాంచరా!
సంశయాలన్ని మదివీడరా... ఓ... ఓ ॥సం॥

4. ధరలో పొన్నాల రాజయోగి ఎరుగు
ఎరుక పరిపూర్ణముల రెంటి మరుగు
అటుపై ఆగోలు రాజచంద్రుడెరుగు
శ్రీధర జన్మ తరియింపు తెరగు
అటులె పరిపూర్ణ గురుజేరరా!
మానవా జన్మ తరియించరా...ఓ....ఓ ॥సం॥





## 25. మంగళహారతి

పల్లవి: జయ జయ జయ పరిపూర్ణ గురుదేవా ! మంగళం
జయ జయ జయ రాజయోగి ప్రియశిష్యా! మంగళం ॥జయ॥

చరణాలు :

1. ఋగ్యజుస్సామాధర్వణ వేదసారం
తర్క వ్యాకరణ మీమాంసాది మధనం
వేద వేదాంత శాస్త్రాగమ పరిశీలనం
అష్టాదశ పురాణేతిహాస పరిశోధనం ॥జయ॥

2. సాధన చతుష్టయ త్రివిధ దీక్షసాధనం
అష్టాంగ చతుర్యోగ ముద్ర అభ్యాసం
ఆధార స్వాధిష్ఠానాది చక్ర శోధనం
ఆకాశ వాయువగ్ని జల పృథ్వీ శోధనం ॥జయ॥

3. శబ్ద స్పర్శ రూప రస గంధ పరిశోధనం
శ్రోత్ర త్వక్ చక్షుర్ జిహ్వ ఘ్రాణ పరిశోధనం
వాక్పాణి పాద పాయూపస్థ శోధనం
వచన దాన గమన విసర్జ నానంద శోధనం ॥జయ॥

4. మనో బుద్ధి చిత్తాహంకారా పరిశోధనం
సమాన వ్యానోదాన ప్రాణాది శోధనం
అన్నప్రాణమయాది పంచకోశ శోధనం
పంచభూత పంచీకరణీ ఆత్మబోధకం ॥జయ॥

5. స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శోధనం
విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మ శోధనం
సత్వరజస్తమో శుద్ధ సాత్విక పరిశోధనం
జాగ్రతాది అవస్థా చతుష్టయ శోధనం ॥జయ॥

6. ఓంకార మాతృకా చతుష్టయ శోధనం
జీవతను చతుష్టయ ఏతత్ పరిశోధనం
విరాట్ హిరణ్య గర్భాది చతుష్టయ శోధనం
ఈశ్వరతను చతుష్టయ ఏతత్ పరిశోధనం ॥జయ॥

7. సద్యోజాత వామదేవాది బ్రహ్మ శోధనం
శరీర నివృత్తి ప్రతిష్ఠాది శోధనం
క్రియ ఇచ్ఛ జ్ఞాన ఆది పరాశక్తి శోధనం
బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివ శోధనం ॥జయ॥

8. ఉత్పత్తి స్థితి ప్రళయ సర్వసాక్షి శోధనం
సూర్యచంద్రాగ్ని బ్రహ్మానంద శోధనం
సర్వకర్తృ సర్వ భోక్తృ సర్వేశ్వర శోధనం
సర్వ పాలకత్వాది సద్గురు సమదర్శనం ॥జయ॥

9. ఇడ పింగళ సుషుమ్నాంతర్గత పరిశోధనం
రేచక పూరక కుంభక ఒడ్యాణాది శోధనం
శ్రవణ మనన నిధి ధ్యాస వర్ణాది శోధనం
క్షుత్పిపాస జరామరణ సుఖదుఃఖరహితం ॥జయ॥



10. తత్వమస్యాది మహా వాక్యార్థ శోధనం
బ్రహ్మైవాహమస్మి అహం పదార్థ రహితం
అద్వయ అవాచ్య అచింత్య అవ్యయం
నిర్వికల్ప నిర్వచన నిర్వికార నిశ్శబ్దం ॥జయ॥

11. నిరతిశయ నిరుపమాన నిర్మల నిర్గుణం
నిరవయవ నిరంధ్ర నిర్విశేష నిత్యం
నిరుపద్రవ నిషిద్ధ నిష్కర్మ నిష్కళంక
నిరంజన నిరాభాస నిష్ప్రపంచ నిరాకార ॥జయ॥

12. సర్వదా వికారశూన్య సహజామనస్కం
శ్రీ వివేకానంద రాజయోగ దీక్షం
ఏతత్ ప్రియ శిష్యరత్న శ్రీధరోహం
సతతం సతతం సతతం భజామి ॥జయ॥



శ్రీ సద్గురు ప్రభుమహారాజుకీ జై
సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు



*At the Lotus feet of*

## SWAMI VIVEKANANDA RAJAYOGI

***A Sweet wave from the heart-cave***

O my Lord, O sympathetic Swami Sangayakhya! Thy delectable lotus feet that is hidden in my heart.

O my ubiquitous Almighty! Thou are my only patron and thou are my only director. All of mine handed over to thee.

O Lord of delighting beauty! I came to know that it is thy delicious beautiful form that enthrals the mind of anybody and everybody.

O my lovely disciple of Rajayogi! Whensoever I touch thy celestial lotus feet, the Divine joy overwhelms me.

O Divine Dancer of Kaivalyasarira! Thou hast removed all the thorns that beseted my life.

O my Lord, Achala Paripurna Asparsha Yogi! I am a puppet in thy hands. As thou like, I can sing and dance. All of mine in thy hands.

O omnipotent Rajayogi! Blessed am I my Lord as thou hast taken this birth to rescue and emancipate me from the bondage of Ghora Samsara.

**Rapelli Sridhar**

ఇది కథకాదు. ఇది జనన మరణ వ్యథ మానుటకై
ఆగమనిగమోపనిషత్ సాగర మధితార్థము.
అహంకార అభిమానరహితులకు ఇవి రత్నములు,
ఇతరులకు రాళ్ళు. అందముగ ఘనులు మెచ్చెదరు.
చంద్రుండుదయంబొందిన సింధువు చెలరేగును
గాని చెరువులు, కుంటలు, నదులు, బావులు చెలరేగవు.




ప్రతులకు:

రాజయోగాశ్రమము,

బచ్చన్నపేట, జిల్లా: వరంగల్ - 506221.

వెల : 15రూ॥

ప్రథమ ప్రచురణ, 1999, 1000 ప్రతులు

---

గ్రాఫిక్స్:

శ్రీ వేంకటేశ్వర గ్రాఫిక్స్, 1-6-564/1, చాయరమార్కెట్, ముషీరాబాద్, హైద్రాబాద్ - 48